# కాలం అంచుమీద...

డా॥ సి. నారాయణరెడ్డి

చేతన్ పబ్లికేషన్స్
1-10-122/18, వివేక్‌నగర్,
హైదరాబాద్ 500 020.

కాలం అంచుమీద....

డా॥ సి. నారాయణరెడ్డి

ప్రథమ ముద్రణ : డిసంబరు, 1985

వెల : రూ. 20

ప్రతులకు :

**కేతన్ పబ్లికేషన్స్**

1-10-122/18,

వివేక్‌నగర్, హైదరాబాద్ 500 020

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**

రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్.

ముద్రణ :

**మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్**

1-1-694/2/ఎ, గాంధీనగర్,

హైదరాబాద్ 500 380

# ఇందులో....

# నదులు

నదులు రాళ్ల మీద దొర్లుతుంటే
యుగాలు ప్రతిధ్వనిస్తాయి.
ఉరిమే నురగల్ని వెంటాడితే
చరిత్రలు పుష్పిస్తాయి.
నదులు చైతన్య నిధులు.
ప్రవహించడం తప్ప
పంపిణీ రాజకీయా లెరుగని
పరమభాగవతులు.
నదుల నాల్కల మీద ఉంటాయి
తిరగబడే స్వరాల చిరునామాలు.
హక్కులు రెక్కలు కొట్టుకుంటే
రోడ్లు నదులవుతాయి.
పిడికిళ్లలో పుట్టిన నదులు
జడత్వాన్ని మండించే జ్వాలలవుతాయి.
నా ప్రతినరం
ఒక నది.
ఒక నయాగరా ప్రహతి.
అది చెమటపట్టిన ఉద్యమాలకు
స్నాన వాటిక.

గొంతుఎండిన ఆశయాలకు చలివేంద్ర.
ప్రతి జీవనది
మూడుకాలాల ప్రతినిధి.
ఆ నది ఒడ్డు
ఆకాశం కనుగప్పు.

# మలుపు

ఎడారి ఇసుక తెప్పల్లో
కొట్టుకుపోతున్న ఊపిరికి
గట్టిలా ఖర్జూరవృక్షం కొట్టుకుంటే మలుపు.
ఆకాశం నీలితెరలో
విరిగిపడుతున్న చూపులను
చేతుల్తో నక్షత్రాలు చేసుకుందే మలుపు.
కళ్లకే కాదు
రాష్ట్రకూ ఉంది మలుపు
ఒక్కొక్క ఉలిదెబ్బతో సృష్టిని ధిక్కరించే
సర్వాంగీణ చైతన్యం సాకృతమైనప్పుడు.

మూగనాథి పగటిమ్మె నాదం
మూలుగవుతుంది;
అదే దళిత కంఠాలకు ధ్వజాలైతే
ఎలుగవుతుంది.
మూలుగు సినాదమైతే మలుపు.
నాలుక పతాక అయితే మలుపు.
'బాంచను దొరా' అంటూ పడున్న గొంతుక
'బద్మాష్' అంటూ ఉరిమితే మలుపు.

సి. వి. [illegible]

# అరుపురంగు ఎరుపు

నరాల్లో నెత్తు ప్రవహిస్తే
నడకలేము.
తూర్పులో చీకట్లు ప్రసవిస్తే
తొలిపొద్దు లేదు.
ఎన్ని మిణుగురులు తోకలు రాల్చుకొంటే
ఒక్క వేకువ పిలుపు.
ఎన్ని నక్షత్రాలు గుండె చీల్చుకుంటే
ఒక్క పొద్దుపొడుపు.
రంగులు మార్చని పిచ్చితల్లి రక్తం.
వెన్నుపోటైనా గుండెతూటైనా
ఆ అరుపు రంగు ఎరుపే.
కుక్కగొడుగులు మొలుస్తాయి
పెంటకుప్పల్లో.
వాటికి వారసులే
అవకాశవాదాన్ని అంటించుకునే భుజకీర్తులు.
అసలైన కీర్తి ఆశ్రయించేది
భుజాన్ని కాదు నిజాన్ని:
నిజం నిప్పుతో నోరు కడుక్కొని
నీతిని తాగే ఉదయాన్ని.

# చినుకు

ఆకాశం ఆశీస్సు చినుకు
మబ్బు మమకారం చినుకు.
చీలిన నేల పెదవిపైన
చిరునవ్వు ముత్యం చినుకు.

మోడు ముఖాన్ని చీల్చే
మొదటి చిగురు చినుకు.
గోరీ నెత్తిలో మొలిచే
పూలగరిక చినుకు.

మగతను తాగే కళ్లలో
రగిలే మెరుపు చినుకు.
మంటల్ని ఉటుమ్మనే గుండెలో
మౌనహాసం చినుకు.

సృష్టిచేతన దిద్దుకున్న
శ్రీకారం చినుకు.
జ్వలిత ప్రకృతి రాసుకున్న
తొలిపలుకు చినుకు.

సి. నారాయణరెడ్డి

# కాలం రిజిస్టర్లో

కాలం సాక్షి
చాపకింది పాములకు
తెరమాటు దోమలకు
పట్టుచొక్కాలు తొడుక్కున్న పన్నాగాలకు
నీతిసూత్రాలు వడుకుతున్న పన్నాగాలకు.
కళ్లు మూసుకుంటే చీకటి పడదు.
పుంజుగొంతుక "క్రీ" ఇస్తే పొద్దు పొడవదు.
అప్పుడప్పుడు చీకటే మెరుస్తుంది
అరువు తెచ్చుకున్న మతాబాలతో.
అప్పుడప్పుడు ఉదితోదయం ఉరుస్తుంది
కిరాయిచేతుల దరువునోళ్లతో.
అంతటా పరచుకుంటుంది కాలం
సంచుల్ని తార్చినప్పుడు
మనసుల్ని ఏమార్చినప్పుడు.
కాలం కన్ను నిశితం.
అది కోసుకుపోతుంటుంది
బండలు పేర్చుకొన్న స్థావరాల్లోకి
పత్రికా విలేఖరులు చొరలేని
పరమ రహస్యాల్లోకి.

కాలం అంచుమీద....

కాలం గమనిస్తుంటుంది
[illegible]డుసు తొక్కి కడుక్కోలేని కాళ్లను
నీటితో జపమాలలు తిప్పి
చాటుగా వెక్కిరించే నొసళ్లను.
ఊరేగింపులకేం ? ఉంటాయి
దేవుళ్లకే కాదు శవాలకూ.
ప్రకటనలకేం? పడుతుంటాయి
సత్యం హత్య జరిగినప్పుడూ
ద్రోహం మోహరించినప్పుడూ.
పలికే పలుకు పడుతున్నది
గుండె లోతునుంచా?
అవకాశవాదాన్ని అనుపదే చే
పెదవి అంచునుంచా ?
కాలం నవ్వుకుంటుంది
తన వ్యక్తిగత రిజిస్టరులో చేర్చుకున్న
నానా ముఖాల్ని చూసి:
ఆ ముఖాల వెనకాల ప్రవహిస్తున్న
రకరకాల ఊసరవెల్లుల్ని చూసి.

సి. నారాయణరెడ్డి

# గొంతుకలో సంక్రాంతి

రాత్రి నా నరాల్లో వర్షిస్తోంది
రక్త ఘోషలా.
అప్పుడప్పుడు వచ్చే అతిథి వెన్నెల
అడ్రసు మరిచిపోయింది
చీకటి ఆటో కుదుపుల్లో.
చీకటీ ! నీకు
చిరునవ్వు నేర్పింది నేనే.
ఆకలీ ! నీకు
అవ్వ బువ్వ పెట్టింది నేనే.
కవిని మరిచిపోయావా?
గొంతుకలో భోగి మంటల్ని అంటించే
గుండెను మరచిపోయావా ?
కవి అంటే భువి
కవి అంటే దివి.
నగ్నత – ఉన్మగ్నత–
రెండూ కలిస్తేనే రవి.
ఎన్నిసార్లు చెప్పాను
ప్రాసలూ చిత్రభాషలూ
కవితలు కావని.

దూషకులూ విదూషకులూ
కవులు కారని.
మంచు స్వెట్టర్ తొడుక్కున్న సూర్యంగారూ
వేంచేయండి
తూర్పుతెర తొలగించుకుని.
వేచివున్నాయి మీ కోసం
వెయ్యి కిరణాలు
కళ్ల జోళ్లు కప్పుకుని.
సాగించండి వెలుగు కచేరీ
పలుకుతుంది మీ గొంతుకలో
పాటను పోగొట్టుకున్న
సంక్రాంతి రహదారి.

# మాతృభారతి మరిచిపోకు

ఎడాపెడా చెక్కిందే
ఏ రాయీ శిల్పం కాదు.
పదే పదే చీల్చిందే
ఏ గుండే కావ్యం కాదు.
గొంతులోనే పుడుతుందా స్వరం?
అయితే అది కిరాయి సరుకు.
నాభిమూలం పేల్చిందే
నాదం సంగీతం కాదు.
దూకే అడుగులూ
కనుబొమల్లోకి ఎగబాకే కులుకులూ
నటనకు బాలశిక్షలు.
అంగాలను ఆత్మతో పీల్చిందే
అభినయం కాదు.
ఎన్ని చావుదెబ్బలు
ఎన్ని గావుబొబ్బలు
భరించి నిలిచింది మాతృభారతి;
ప్రచండ ఝంఝులకు ఆరిపోని
బ్రతుకు హారతి.
నెత్తిమీద కొండంత బరువు.

కాలం అంచుమీద....

ఎడమచేయి కదిల్చినా
కుడిచేయి విదిల్చినా
ఉప్పుగాలిని ఊదే శూన్యం.
కుదురుగా నిలవాలనుకుంటే
కాళ్ళకిందా ఓ అఘాతం.
అయ్యో భారతమాతృకా !
వేదంలో పుట్టావు
నాదంలో పెరిగావు
పరాక్రమణల్లో నలిగావు
చిరంతనంగా వెలిగావు.
కాలం ఇసుకలో దిగబడ్డ
కాళ్ళను పెరుక్కుంటూ
ఏళ్ళమీద నడుస్తున్నావు.
ఉసిరి కొడుతున్న ఇసుక సుడిగాడ్పును
చెప్పుల్తో ఊదేసి ఊపిరితో బాదేసి
ప్రాణవాయువులా ప్రవహిస్తున్నావు.
గతవైభవాన్ని గతకే వందులకేమి?
ప్రస్తుతంరొంపిలో పొర్లే పందులకేమి?
భవితవ్యాన్ని నేటివేళ్ళతో పీల్చుకునే
భారతీ ! గమనించు.
బురదను చిలికితే ఏమొస్తుంది
పరమకంపు తప్ప.

గంధం చెట్టును నరికితే మరేమీ రాదు
సుగంధం తప్ప.
దుర్గంధాలను స్ప్రేపొరల్లో కప్పుకున్న
సుగంధాల మధ్య
సమైక్యతలా పరిమళిస్తున్న సమన్వయ శాంతి
జాగ్రత్తసుమా నీ గుండెకాయ
మరీ అంత వైశాల్యం
మనుగడకే ప్రమాదం.

# సముద్రాలు నాకళ్లు

సముద్రాలు నా కళ్లు
వాటిలో ఉప్పే కాదు నిప్పూ ఉంది.
ఆ రెప్పల రేవుల్లో
కలల నౌకలే కాదు
స్మృతుల శవాలూ తేలుతుంటాయి.
నిన్నటి తొక్కిసలాటలో విరిగిన
వెన్నెముక తునక
ఇవాళ సవాలు చేసింది
వజ్రాయుధంలా వాడుకొమ్మని.
సానపట్టి చూశాను ఒడ్డు అంచుపైన.
ఛేదించాను ఉరుముకొస్తున్న కెరటాలను.
చిట్లిపడ్డాయి నెత్తురు మెరుపులు.
ఇప్పుడు తెలిసింది
నేనే నా ఆయుధాన్ని.

సి. నారాయణరెడ్డి

# ప్రవహించే పాట

నాభిలో పుట్టిన పాట
నాలుక మీద ఎగురుతుంది.
గొంతులో పడగెత్తిన పాట
గుమ్మందాటి ఉరుకుతుంది.
ప్రసరణం పాటకు రక్తగుణం.
ఆవేశాన్ని అంటిపెట్టుకుని
ఆశయాన్ని ఒంటపట్టుకుని
ప్రవహించే పాటకు
ప్రజలు సముద్రాలు.
ఊరేగింపులో అది
ఉగ్రనేత్రం.
ప్రతిఘటనల్లో అది
ప్రభంజన గాత్రం.
పాటకు శ్రుతి ప్రజలనాడి
పాటకు స్థాయి ప్రగతివాది.

# మానవతా తమాషా చూస్తున్నావా!

ప్రతియేటా నగరం నట్టింట్లో
పైశాచిక పర్వంతులు.
కర్ఫ్యూ సూర్యుని సాక్షిగా జరిగే
విచ్చుకత్తుల కసరత్తులు.
మతం లేబిల్ వేసి మనుషులకిచ్చే
మత్తు ద్రావకాల యెత్తులు.
ఒక మతం సాగించే ఊరేగింపు
మరో మతానికి కంటగింపు.
ఒక మతం పాటించే మౌనం
మరో మతానికి కల్లోలధ్యానం.
ఎన్నిసార్లు ఘూర్ణిందో ఇక్బాల్!
ఎలుగెత్తిన నీ అమర సూక్తి.
''మజ్హబ్ నహీం సిఖాతా
ఆపస్‌మె బైర్ రఖ్‌నా''.
గుర్తొంది గురజాడా ! నువ్వు
గురిపెట్టిన అమృతోక్తి.
''మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును''.

ఇంతమంచిని ఎప్పుడో పంపిస్తే
ఎలా జీర్ణించుకుంటుందయ్యా దేశం?
జాతీయతకు రక్షకవచంగా నిలిచిన
స్వర్ణాలయమా !
నాభిగూటిలో ఎలా దాచుకున్నావు
నరహంతకులను ?
"గురువాణి" ధ్వనించే నీ గుండెలో
పరమ కిరాతకుల హుంకారాలా?
అవి అర్చనలా
హత్యా శిబిర శిక్షణాలా ?
మానవతా తమాషా చూస్తున్నావా !
ఏరిపారెయ్యి మతం ఆసరాగా
తల్లినేలను చీల్చే దగాకోరుల్ని.
హెచ్చరించు చిచ్చు గొంతుకతో
మతం ఒక అభిమతమని
అది వ్యక్తిగతమని
అంతవరకే హితమనీ
ఆ హద్దు దాటితే ఖతమనీ.

# మరోసారి రుజువయ్యింది

కాలం జేబురుమాలు కాదు
అది అఖండ వుకూలం.
క్షణాలనీ దినాలనీ
వత్సరాలనీ యుగాలనీ
కత్తిరించుకుంటాడు మనిషి
తన జేబులో ఇమిడేటట్టు.
నిమిషాలు కురుస్తుంటాయి
పరుగులో చెమట చుక్కల్లా.
రోజులు రాలిపోతుంటాయి
ఎదుగులో ఎండుటాకుల్లా.
పుట్టిన రోజులూ షష్టిపూర్తులూ
మనిషికే.
కాలం పుట్టుక ఫైలుకెక్కనిది.
అది అనంత యవ్వని.
అస్తమయమైనా పొద్దువాలనిది.
మొన్నటి బ్యాలెట్ పెట్టెను చూసి
ముసిముసిగా నవ్వింది కాలం.
తలరాతలను గళ్లలో బిగించే

జోస్యాల రాతలను చూసి
అలవోకగా ఏడ్చింది కాలం.
సూర్యుడికి అంటదు మంచు
చూపులో నిప్పుంటే.
మనిషికి అంటదు మగత
నడకలో చురుకుంటే.
కాలం కన్న శిశువు - మనిషి.
అందుకే పడివుంటాడు అంకెల్ని చప్పరిస్తూ.
అప్పుడప్పుడు తిరగబడతాడు మనిషి
ఆ కాలాన్నే గాలిలా ఊదేస్తూ.

# ఆరేళ్లపాప నూరేళ్లవేళ్లు

ఉడికిపోయింది చీకటి
తన కోటమీద దీపం జెండా చూసి.
గుడ్లురిమింది చీకటి
గుడ్లగూబల్ని కళ్లతో విసిరేసి.
''ఈ జెండా ఎగరేసిందెవ్వరు?''
కమురుపొగలా కమ్ముకున్న
కటిక చీకటి హుంకారంలో మెరిశాయి
ఆరేళ్లపాప నూరేళ్లవేళ్లు.
''ఈ పాప ఎగరేసిందా దీపాన్ని?''
తల పగిలేటట్టు నవ్వింది బలుపు చీకటి.
పసివేళ్లను ఆర్పేయాలని
బుసకొట్టింది విషపు చీకటి.
దీపాలు విచ్చుకున్నాయి
కోటకొమ్మమీద కోటిపుష్పాలై.
ఎటుచూసినా ఆ పసివేళ్లే.
ఏమీ తోచలేదు చీకటికి.
''ఆ వేళ్లను నరికేస్తే దీపాలెగరవు''
ఉన్మతి ఊబిలో దిగిన చీకటి

ఉప్పున హుంకరించింది
తన ఊర్పే సుడిగాలి అనుకుని.
అది చీకటి ఆఖరి ఊపిరి;
అదే ఆరేళ్లపాప నూరేళ్ల వేళ్లు
అమృతంగా వెలిగించుకున్న దీపావళి.

# పత్రాక శీర్షిక

పొద్దున్నే పుట్టెడు వార్తల్ని
పుక్కిలిస్తూ వస్తుంది కాలం.
రాజకీయాల రంకులు
రాజీనామాల బొంకులు
ఒళ్లంతా మచ్చలుగా అచ్చుపడుతుంటే
కళ్లతో నవ్వుతూ వాకిట్లో రాలుతాయి
సిగ్గులేని పత్రికలు,
ఎంత దుమ్ము రేగిందో
ఏముఖమూ ముఖంలా కనపడదు
మబ్బులు రంగులు మార్చినట్టు
కొండముచ్చుల తలలకు
కుచ్చుటోపీలు మొలిచినట్టు
ఊసరవెల్లులు సుమతి శతకాన్ని
ఉదాహరిస్తున్నట్టు.
పత్రికల్లోని కార్టూన్లు
పగలబడి నవ్వుతుంటాయి
సరదాగా తాము గుచ్చిపెట్టిన
పరిహాసాల గుండ్లు

కుత్సితాల రొమ్ముల్లోకి
కుమ్ముకు పోతున్నందుకు.
పాపుల చర్మం ఇనుపరేకు.
గుండ్లను గుడ్లలా పొదుగుకుంటుందది.
తనను పరిహసించిన పత్రికాక్షేత్రంలో
ఓ యెకరం పుటను ఆక్రమించుకుంటుంది
పదవి దక్కిన పరమార్థిక శక్తి.
కార్టూన్లు కళ్లు మూసుకుంటాయి
వ్యాఖ్యలు నోళ్లు నొక్కుకుంటాయి
కాలం ఒళ్లు విరుచుకుంటుంది
రేపటి పత్రికలో పతాకశీర్షిక కావడానికి.

# ప్రతిరోజూ ఓ ఉగాది

ఎన్ని ఉగాదులను పీల్చుకున్నాను
ఈ కళ్లతో;
ఏటా ఓ సారి కాదు ప్రతిరోజూ.
పొద్దును పొడుస్తూ లేస్తాను.
ఓ గంటసేపు నేలనూ గాలినీ
దున్నేస్తాను.
నడిచేటప్పుడు నా జేబులోంచి
రాలిపడే 'గిన్నె'లు.
వసంతం దాడితో విరిగిన
పండుటాకుల వెన్నులు.
నాకు తెలుసు
కాలంచేసే సంతకాలు
చిగురూ, చినుకూ, చలీ, ఆవిరీ.
కాలానికి తెలియదా
కాలక్రమం మారిందని;
చిగురేసే చెట్లలోంచి
సెగలు చిట్లుతున్నాయని.
ఇకపోతే ఎక్కడుంది చలి?

సి. గా

సగటు జీవుల నరాల్లో
సగానికి పైగా దూరింది.
పిరికి తనం కంటే మరణముందా ?
ఓ కాలమా !
సాగించుకో నీ వ్యాపారం.
అన్నీ ఉడిగిన గత కీర్తులతో
బతికున్నా కీర్తిశేషుల పట్టికలో
అతుక్కున్న మృతవర్తులతో.

# కాలాన్ని గాలిలా ఊదేస్తూ

కాకుల మూకల్లో ఉన్న ఏకాకిని.
అంతరాత్మలు అమ్ముడుపోతున్న
సంతలోని సగటు మనిషిని.
నిన్నటిదాకా తొడపరిచిన
మహానాదర్శాల ముల్లులు
తెల్లారేసరికి ఊసరవెల్లులు.
కిరణంలా నేను పడిచూస్తుంటే
ఎలా కమిలిపోతున్నారో
దోషుల్లా ఆత్మద్రోహుల్లా.
వీళ్లు పడ్డారు కాలంతీసిన
ఎక్స్‌రే బొమ్మల్లో.
ఇవాళ అతికించుకున్న మీసాలు
పడగలెత్తుతూ వున్నా
నిన్నటి పేడిమూతులున్నాయి
ఆ బొమ్మల్లో సాక్షుల్లా.
పది నిమిషాలు చాలు పశువుకావడానికి
పామై కాటెయ్యడానికి.
మన్వంతరాలు కావాలి
మనిషి మనిషిగా నిలవడానికి.

సైతానుల వాడల్లో శ[illegible]నుల నీడల్లో
నీతికి పాతరవేస్తున్నారు
సమతకు సమాధి కడుతున్నారు.
ఆ నీడలు నా చుట్టూ
ప్రలోభాల వలల్ని పరిచినా
నేను నేనుగా ఉన్నాను.

# దేశమా! చూసుకో నిన్ను నువ్వు

తల పగిలిపోతున్నది -
నొప్పితో కాదు.
గొంతు ఎండిపోతున్నది -
దప్పితో కాదు.
ఒళ్లు కాలిపోతున్నది -
జ్వరంతో కాదు.
గుండె ఊగిపోతున్నది-
పోటుతో కాదు.
నానాటికీ దిగజారుతున్న
నా దేశాన్ని చూసి.
పట్టపగలే ఊరేగుతున్న
పచ్చి మోసాన్ని చూసి.
దేశమా ! చూసుకో నిన్ను నువ్వు
అంతరంగం అద్దంలో.
నువ్వు పదిలంగా ప్రదర్శించే
చిరునవ్వు వెనక
ఎన్ని విషాదవలయాలో.
ఏటా రెండుసార్లెత్తే

నీ జండా వెనక
ఎన్ని అదృశ్య కృపాణాలో.
ఎన్నిసార్లు హైజాక్ చేశారు
నీ మానాన్ని.
ఎన్నిసార్లు తూట్లు పొడిచారు
నీ సహనాన్ని.
ప్రపంచ విపణి వీథిలో
నీ పరువును వేలంవేసే ముందే
మాతృదేశమా ! తడిమి చూసుకో
మూతపడ్డ నీ మూడో కన్ను.

# విద్యుత్తులు పిల్చుకుంటూ

ఇసకలో నడుస్తున్నావా
ఏవీ నీ పాదముద్రలు ?
తుడుచుకు పోతూంది గాలి.
మంటల్లో నడువు
మౌనం పగులుతుంది.
బురదలో నడువు
పద్మం పలుకుతుంది.
ఇదీ ఓ సడకేనా
అడుగులో అడుగును గతుక్కుంటూ.
గొర్రెలూ నడుస్తాయి
బుర్రల్లో బుద్ధిని కుక్కుకుంటూ.
నేనే ప్రతి అడుగు
చూసుకు పోవాలి
వెయ్యి విద్యుత్తులు పిల్చుకుంటూ

సి. నారాయణరెడ్డి

# హితంలేని మతమెందుకు?

మహాత్ములు చచ్చారు మతం కోసం.
సామాన్యులు చస్తున్నారు మెతుకు కోస
ఎండిన నోటికి చినుకందించలేని
చీలిన గొంతుకి ఊపిరందించలేని
మతమెందుకు మహాశయా !
గుక్కెడు మంచినీళ్ళ కోసం
తొక్కిసలాడుతున్న కడుపుల్ని
ఉద్ధరిణెడు గంగాజలంతో
ఉద్ధరించలేవు స్వామీ !
అన్నమో రామచంద్రా అంటుంటే
ఆత్మల గోల యెందుకు ?
అన్నీ కుదిరిన తర్వాత
అంగాలు కుదుటపడిన తర్వాత
అరకంచం గంజన్నంతో
ఆకలి కొండెక్కిన తర్వాత –
చూసుకుందాం సోహాంల అహాంల
సూక్తుల మారుమోత.
రమణీసీ రాచరికాన్నీ

కొడుకుగా కులీనతగా
బుడగలా ఊదేసిన బుద్ధికి నమస్కారం.
పెట్టుబడి దివాలా తీసిన ఆ సిద్ధికి నమస్కారం.
మతముందా బుద్ధికి ?
బలముందా సిద్ధికి ?
నా నిర్వీర్యపీడా స్వరంలో
సంగీతంగా దీనాతి స్మరణం.
అగ్రవర్ణాల కొవ్వుమంటలో
అంతిమ వర్ణాల దహనం.
రాసుసుధారసంతో పొట్ట నిండి
రమ్యంగా తేనుస్తున్న భర్తాగణీ !
ఒక్కపూట తింటావా
దిక్కుమాలిన శబరి ఎంగిలిని.
ఇంతకూ ఏ మతం చెప్పదని ?
"ఈశ్వర్ అల్లా తేరే నామ్-"
"ఎల్లరికీ సన్మతి" ఇమ్మని.
అదే అదే నేనంటున్నది
అమతీ — సన్మతీ అనుక్షణం
ఆత్మహత్య చేసుకుంటున్నావని.
ఇతిహాసమా ! బయటపడు.

మతం పేరుతో జరిగిన ఊరేగింపులనూ
కమిలిన శవాల కంపులనూ
వింగడించి చూపు.
అప్పుడు గాని పొడుచుకు రాదు
అసలైన రేపటి రేపు.

# వృక్ష పురాణం

వరదైనా బురదైనా జీవనదికే.
చిగురైనా పిందైనా చేవ చెట్టుకే.
కెరటాల తొక్కిడీ ఉప్పెనల ఉరవడీ
పుట్టదు కాదు ఏటిగట్టుకే.
వృక్షానికి సౌభాగ్య రేఖలు
విభిన్న శాఖలు.
పూలు పండిపోతున్నా
మంచుతో కూరుకుపోతున్నా
కొమ్మలు గీపెట్టవు.
తట్టుకుంటాయి తప్పుకుంటాయి.
పూల మాతృకపైన
పుట్టెడు ఆశలు పెట్టుకుంటాయి.
కోకిల కూజితాల కాగితాల మీద
గువ్వ కుత్తుకలు అచ్చొత్తి
అర్జీలు సమర్పించుకుంటాయి.
అమ్మలాంటి వృక్షమూలమా!
కొమ్మకు కొమ్మకు మధ్య పక్షపాతమా!
అన్ని కొమ్మలూ
వంగి వంగి సలాములు చేయవు.

వంగి వంగి ధరిత్రిని గిల్లుతూ.
కొన్ని కొమ్మలు పొగరుబోతులు.
గాలిని ఉప్పెన చేసి
ఎక్కుపెట్టిన శిరస్సుల ధనుస్సులతో
ఆకాశం అధిష్ఠాన వర్గాన్ని
ధిక్కరిస్తాయి.
అమ్మా! ఆ కొమ్మలూ నీ బిడ్డలే
ఆ నరాల్లో పారేదీ నీ రక్తమే.
అవి నేర్చిందీ నీ విద్యే.
కొమ్మల్ని కులాసాగా ఊగిపోనీ
రెమ్మల జేబురుమాళ్ళను ఊపుతూ.

# శిశిరావిష్కారం

నిరుద్యోగం రాలుతోంది బొట్లు బొట్లుగా
సర్టిఫికెట్ల నొసళ్ళనుంచి.
ఆకలి పేలుతోంది అవిరామంగా
అణచబడ్డ పిడికిళ్ళలోంచి,
ఇగిరిపోతుంది ఎండతో పుట్టిన చెమట.
ఆకలి ప్రసవించిన పసుపు ఆరిపోయి
నిప్పును విసురుతుంటే తప్ప.
నెత్తిలోపలి శాంతి చిలుపుతుంది
ఉడికెడు చన్నీళ్ళతో.
సంధిలో నాడిలో గూటిలో పాటలో
చోరబడ్డ నిరసన
విక్రమిస్తుంది వెయ్యికాళ్ళతో.
'అంతాభద్రం' అనుకుంటున్న వ్యవస్థా!
ఉద్యోగం రాదనుకున్న అవస్థా!
శిశిరంలో పండుటాకుల్లా రాలిపోతున్న చూపుల్ని
మళ్ళీ బతికించకు వెళ్ళకు.
చేవ వుంటే చెట్టు
చిగుళ్ళ మహళ్ళను కట్టుకుంటుంది.
కన్నా అంతే—

దర్శన ధాతువుంటే ప్రసవిస్తుంది
మధ్యాహ్నమార్తాండుల్ని.
కళ్లలో చీకట్ల ఎడారులు ఆవులిస్తే
వేళ్ళలో చూపులు మొలుస్తాయి.
తాకిన బీడల్లా తరంగం.
కదిలిన వల్లకాడల్లా కళ్యాణ మంటపం.
నేటి మోడు నేర్చుకునే రేపటి భాష చిగురు.
మసక కంటిలో ప్రసరించే శిశూదయం చూపు.

సి. నారాయణరెడ్డి

# కాలం గొంతులో వెలక్కాయ

ఆవులింతలా పరుచుకున్న శూన్యంలోంచి
అడుగుల ముద్రల్ని నంజుకు తింటున్న
ఎడారిలోంచి
గడియారం ముళ్లను చప్పరించి ఉమ్మేసే
కాలం ముసలి నోటిలోంచి
ఒక పదం పుడుతున్నది.
ఒక జీవనదం చెయ్యబోయే సంతకానికి
నమూనా చుడుతున్నది.
ఇంతలో
కాలం గొంతులో వెలక్కాయ.
కదిలే క్షణాలనూ దినాలనూ
ఇసక కాగితం మీద శూన్యం జీవితం మీద
ఎక్కించక తప్పని ఎమర్జెన్సీ.
కోట్ల తలలతో ధరాగగనాల్ని
చిమ్ముతున్న విజ్ఞానకోశమా!
వట్టిపోయిన ఎడారి పొదుగుల్లో
పచ్చికపాలు పితకలేవా?
కారుణ్యక్షీరాన్ని కడవలకొద్దీ పంచే
సర్వమత సామరస్య పితమా!

గడపలో ఎగజిమ్మే రక్తాన్ని గుర్తించలేవా?
పదునెక్కిన ప్రశ్నలకు
ప్రాతిపదిక ఈ కవిత.
కవితకు కాలమే సర్వసాక్షి
భవిష్యత్తును విశ్లేషించే విప్లవాక్షి.

# గొర్రెలు గొర్రెలు

వంచిన పుర్రెలు ఎత్తకుండా
'మంద' బుద్ధిని మరవకుండా
దొరికిన గరికను కొరుక్కుంటూ
దొడ్డిదారినా అడ్డదారినా
దొర్లుకు పోతున్న గొర్రెలు గొర్రెలు.
దేశమంత సువిశాలంగా ఉన్న మా దొడ్లో
ఎన్నెన్ని గొర్రెలని.
పక్కలను మించిన కొవ్వుంది
కానీ చురుకెత్తి అరవవేం
కరపడం చేతకాకున్నా.
గొర్రెలూ ప్రశ్నించుకుంటాయి
కొట్టాల్లో నెమరేసుకుంటున్నప్పుడు.
జవాబులు జారిపోతుంటాయి
దవడలమీది నురగల్లా.
కడుపు ఖాళీ అయితే కల్లోలం
కర్ర కనిపిస్తే కంపరం.
ఏమిటీ గొర్రెతనం?
తమ తెట్టెమీద గాలివేళ్లు పడ్డా
తేనెటీగలు కమ్ముకుంటాయి బుసనాగుల్లా.

ఆ మాత్రం చేతకాదే గొర్రెలకి?
నల్లమందులాంటి పిరికితనం
నరాల్లో పేరుకున్న గొర్రెలు
పడిపోతాయి మూగస్వాముల్లా
పడగెత్తలేని నీటిపాముల్లా.

[illegible]

# అంగట్లో అన్నీ ఉన్నాయి

ఆశయాల అంగట్లో అన్నీ ఉన్నాయి
సగటు మనిషి నోట్లో శని తప్ప.
పాఠ్యభాగాల ప్రవచనాల్లో అన్నీ ఉన్నాయి
పట్టభద్రుల చేతుల్లో పని తప్ప.
జెండాలు చేతులూపితే చాలు
గుండెలు గుండీలు తెంచేసుకుంటాయి.
క్యాసెట్లు ఖంగుమంటే చాలు
వీధులు చెవుల్ని విసిరేసుకుంటాయి.
ఎక్కడో పొగలా మూగిన కర్ఫ్యూ –
ఇక్కడ భగ్గుమనే బొమ్మల దుంపట్లు.
ఏ సందులోనో ఓ చిన్న కత్తిపోటు –
ఇక్కడ నగరం నడిబొడ్డులో హత్యాకాండలు.
మైకుల్లోంచి కురుస్తూనే ఉంటాయి
మత సామరస్య హిత ధారలు.
సామరస్యం సహజీవనం
అరిగిపోయిన రికార్డుకి రెండు పక్కలు.
ప్రజాస్వామ్యం ప్రజాసంక్షేమం
పాలకవర్గం జపించే రెండు ముక్కలు.
మాటలు గాలి కోత నేర్చుకుంటాయి
చేతలు చేతులు మార్చుకుంటాయి.

# కాకీ కాకీ కలవరకాకీ !

కాకిదీ కోకిలదీ ఒకే వర్ణం
కారు నలుపు.
కంఠంలోనే తేడా.
కాకి అరుపు నలుపు.
కోకిల పిలుపు తెలుపు.
కాకిలా ఊరేగదు కోకిల.
మైకులా కొమ్మను మలచుకుని
ప్రభాతాన్ని ఊపిరిస్తుంది
పంచమ శ్రుతిలో.

కనపడకుండా వినపడే కోకిలంటే
కాకికి కసి
ఎంత అరిచినా తనకు గుర్తింపులేదని.
ఇంటికప్పు మీద వాగి
ఎంగిలాకుల మీద వాలి
నానా రభస చేసే కాకీ !
కోటి జన్మలెత్తినా నువ్వు
కోకిలవు కాలేవు.
పంచమ స్వరం
కోకిలకు పిత్రవరం.

కటికి గోలను గాలిలో కలిపేసి
కలుష బుద్ధిని నేలలో పాతేసి
సాధించుకో
మతి తప్పని సంస్కారాన్ని
శ్రుతి తప్పని శుభాకారాన్ని.

# నా శబ్దం ఎన్నికల్లో

నిలబడింది నా శబ్దం ఎన్నికల్లో
నిలువెత్తు అద్దంలా.
వేలమంది విరగబడ్డారు
క్యాలో నిలబడి చూసుకున్నారు
తప్పక గెలుస్తానని
తల తట్టుకున్నాను.
ఫలితాలు చాటాయి నా ఓటమిని
పలు ముఖాలుగా.
ఓడితే ఓడాను గానీ
ఒక్క శాతం ఓట్లేమిటని ?
తర్వాత తెలిసిన తాజా రహస్యం
అద్దంలాంటి నా శబ్దంలో
ఊహాలే తప్ప
ఊహాయిలు కనపడలేదని.

సి. నారాయణరెడ్డి

# క్యాలెండర్ లోంచి

తల చుట్టూ చుట్టుకున్న క్యాలెండర్ లోంచి
రాలుతున్నాయి
అతిథులు ఆక్రమించిన సెలవులు
అభ్యర్థులు కబళించిన పండగలు.
ఎన్నిసార్లు ఎదురుచూశానో
వెన్నెముకలో నిప్పంటుకోవాలని.
ఇంకెక్కడి నిప్పు ?
కురుస్తున్న సోది బూది.
వెన్నెముకలో మంచుపునాది.
క్షణక్షణం పేరుకునే నిశ్శబ్దాన్ని
అణువణువునా పేల్చాలని
ఎన్నిసార్లు గన్నెత్తానో !
పేలినచప్పుడే గానీ
కూలిన చప్పుడు లేదు.
అణువుల్ని పుక్కిట పట్టుకున్న
కాలం అహంకారానికి
వెల కట్టుకున్నాను.
తల నుంచి జారుతున్న క్యాలెండర్ని
మొలకు చుట్టుకున్నాను.

# ఓటర్లు బరాబిాటర్లు

అడ్డమైన గాలికి ఎగిరిపోయే
గడ్డిపోచ కాదు దేశం.
దాని ఉనికి ప్రజల నాడి
దాని ఊపిరి ప్రజల నాడి.
అది నిలిచివుంటుంది అక్షతంగా
హిమాలయ శిఖరం శిరోరక్షగా
హిందూ మహాసముద్రం చరణరక్షగా
స్వైచ్ఛ్యత సంక్షేమ రక్షగా
స్వాభిమానం శ్రీరామరక్షగా.
దేశం వెన్ను చీల్చాలని
దివాలాకోరు ప్రయోగాలు
దేశం గుండె పేల్చాలని
సైతానుల పన్నాగాలు.
పిచ్చిచేష్టలు గానీ
నిప్పును ఊదేస్తే బొగ్గవుతుందా ?
నిలిచే కాగడా అవుతుంది.
మట్టిలో విత్తును పేలిస్తే చస్తుందా
మహావృక్షమై లేస్తుంది.

దేశానికి ప్రజాస్వామ్యం నేర్పించి.
వార్తకు కత్తెరలూ వాక్కుకు సంకెళ్లూ
బిగించని దేశం
నిలబడుతుంది ఎన్నికల్లో
నిలువెత్తు ఒడిసాచి.
ఓటంటే మాట కాదు
ఉపన్యాసాల ఊటకాదు
కాగితంలో ముద్రపడే ఓటు
జీవితాల్ని బేరీజువేసే గీటు.
అమాయకులు కారు ఓటర్లు
అచ్చమైన న్యాయానికి బరామీటర్లు.
అప్పుడప్పుడు వాళ్లు
అన్నలను మింగిన తమ్ముళ్లు
అమ్మలను మించిన కూతుళ్లు.
ఎన్నిసార్లు నేర్చుకుంది ఈ దేశం
ఎప్పటికప్పుడే ఓ గుణపాఠం.
తల్లి పరువును నల్లడబ్బు కోసం
తాకట్టు పెట్టే వాళ్లన్నా
బిచ్చపు పదవి కోసం మానవత్వాన్ని
రొచ్చులో కలిపే వాళ్లన్నా
ఎక్కడో సాగర జలసంధులు దాటేసినా

పక్కనే పొంచిన రక్కొస పొదలు కాటేసినా
కంటి రెప్పలే కనుగుడ్డును కబళించినా
ఇంటికుక్కలే నడిబొడ్డును కరిచేసినా
నిట్టూర్పుల వెల్లువలో కొట్టుకుపోదు దేశం.
నిలబడుతుంది మరింత బలంగా
నేలలోతుల్ని వేళ్లతో నిగ్రహించుకుని.
ఆకాశాన్ని పిడికిళ్లలో బిగించుకుని.

# ఎంతధీమా దీపానికి !

ఎంత ధీమా దీపానికి !
చుట్టూ కురిసే చీకట్ల జడివానలో
శిఖరంలా నిలబడుతుంది
శిరస్సును వెలిగించుకుని.
తీగ అంటించిన దీపం - పువ్వు.
పెదవి ముట్టించిన దీపం - నవ్వు.
సృష్టి వెలిగించుకున్న ఆదిరూపం
ఆదిత్య దీపం.
కంకాళాలు కరిచే దిబ్బలో
కాళ్లే దీపాలు.
క్రౌర్యం కమ్ముకున్న గడ్డలో
కళ్లే దీపాలు.
కడుపుమంట దీపమంటే
గబ్బిలాల సంస్కృతికి.
ఒక్కొక్క కిరణం ఓ గండకత్తెర;
మత్తు మరిగిన తమ రెక్కల్ని
కత్తిరిస్తుందని భయం.
చావ తప్పనుకోకుంటే ఓ మాట -

దీపానికి మొక్కడం
తేజస్సు మెట్లెక్కడం.
అప్పుడప్పుడు జాతిదీపాలను
ఆర్పేస్తుంటాయి మతిమౌఢ్యాలు.
పిచ్చిగానీ –
పుట్టిన ప్రతి శిశువులో
పుట్టెడు దీపాలు ప్రవహిస్తుంటే
ఆర్పడానికి చేతులెక్కడ మూఢులెక్కడ ?

సి. నారాయణరెడ్డి

# కత్తుల గుప్పిట్లో

కత్తుల గుప్పిట్లో
కాలం ఊపిరి పీలుస్తూంది
మెత్తని చిరునవ్వుతో
పాపం ఆ చిరునవ్వుకి
ప్రతిక్షణం మరణం
జననం చిరునామాతో.

# ప్రతిఅక్షరం ఓ రక్తకణం

ఈ క్షణం
ఈ పుటమీద నడుస్తున్న ప్రతి అక్షరం
ఓ రక్తకణం.
"అంటుకుంటుందా పాఠకోత్తమా
ఆ రక్తం నీ కళ్లకు?"
అయితే ఆ ప్రతిక్షణం
రేపటి ఉదయం చేసే నేటి సంతకం.
అరుస్తుంది అక్షరం రక్తంలాగే
చిన్నబొట్టులో తుఫానుల్ని చిచ్చుకొడుతూ,
రక్తానికి స్వరం కడితే రాగం
అది కాస్తా తిరగబడితే సంగ్రామం.
నాభిలో పడగెత్తినా
నరాల్లో అలలెత్తినా
సాగుతుంది ఒకే చైతన్యం
సాధనలా రుధిరస్పందనలా.
అక్షరాలతో ఆడుకునే కళాకారుణ్ని.
అందుకే చిత్రిస్తాను
రక్తాక్షరాల ఉద్వేగ రహస్యాల్ని.

పరస్పరం కుమ్ముకునే చీకటి వెలుగుల్లో
చెరలాడుకునే చాపు పుటకల్లో
చెక్కుతాను సమన్వయ సందేశ శిల్పాల్ని.

# దీపం దీపమే

ఎన్ని బల్బులు కట్టినా
ఎన్ని వెలుగు కడ్డీలు పెట్టినా
దీపం దీపమే.
పత్తిపూలలోంచి కొత్తనెత్తురు చేసుకునే దీపం
మార్క్సిజం బళ్లో
వర్గ సంఘర్షణ పాఠాలు నేర్చుకునే విద్యార్థి.
కటిక చీకటి కారడవిలో
జ్యోతిలా తుపాకి ఎత్తిన గెరిల్లా.
పొగడ్తలు మూగుతాయి దీపం చుట్టూ
పురుగుల మందల్లా.
పొగడు సరికదా దీపం
పొగిడే నాల్కల రెక్కల్ని తగలేసి పంపిస్తుంది.
పైసాలకూ పదవీ విలాసాలకూ అమ్ముడుపోని
ప్రజాప్రతినిధి దీపం.
పొత్తిళ్ళపువ్వుల్లో కత్తిపోట్లతో
కిరణాల్లాంటి బిడ్డలు గిలగిల కొట్టుకుంటూంటే
గుళ్లోని దీపం గుండెపగిలి ఏడుస్తుంది.
మసీదులోని దీపం మౌనహింస అనుభవిస్తుంది.

కర్ఫ్యూలా గదిలో గాఢాంధకారం ముసిరినప్పుడు
నా చూపును చూపుడువేలై
నడిపించే నేస్తం దీపం.
నోరు కాలుతున్నా నొసలు మండుతున్నా
బొబ్బపెట్టదు దీపం.
తన మౌనం ఒక జ్వలనం
తన మరణం ఒక ఉదయం.

# నిప్పంటుకుంది

నిప్పంటుకుంది
మౌనం లాంటి మంచులో.
మగతతో లాలూచీపడ్డ
మనిషి వెన్నెముకలో.
బద్దలయ్యింది గొంతు
నిద్దర్లేచిన అగ్నిపర్వతంలా.
నరాలు బిగించుకున్న తీగల్లో
జ్వాలా స్వరమేళ.
కరిగిపోయిన నక్షత్రాలు
రాలుతున్నాయి బొట్లుబొట్లుగా.
ఒంటిమీద రాలిన ఒక్కొక్క చుక్క
ఓ రాగపతాక.
గుండెచేసింది జెండా వందనం.
చెమట చుక్కలు బారులు తీర్చాయి
జెండా నీడలో బాలబాలికల్లా.
రగులుతూనే వుంది నిప్పు
రక్తాన్ని శిల్పాల్లా చెక్కుకుంటూ.
ఈ నిప్పు కాల్చేదికాదు
మార్చేది.

మార్పు నిప్పు.
మార్పును నినదించే పాట నిప్పు.
చీకటి కటకటాలను చీల్చే
తొలిపొద్దు నిప్పు.
కాలాన్ని దూసుకుపోయే కనుగుడ్డు నిప్పు.
ఆ నిప్పే అంటుకుంది
మౌనంలో మనిషిలో.
మనిషికి మగత ఎక్కించే ప్రకృతిలో.

# ఘోష

అరుస్తున్నది శిశువో పశువో
అక్కర్లేదు.
కావలసింది
కాలం స్తబ్ధతను ఛేదించే
కత్తి మెరుపు.
అరుపు సొంతం కాదు మనిషికి.
అది నోరు లేని
విత్తనానికీ వుంటుంది.
పదును చేసిన మట్టిలో పాతినప్పుడు
అరుస్తుంది మట్టిపొరల్లో మగ్గే విత్తనం
పొత్తిని పోరుగా చీల్చుకుని.
అరుపు ప్రసవించిన వృక్షం
ఆకులు ముడుచుకు కూర్చోదు.
ఘోషిస్తుందది
కొమ్మ కొమ్మకో మైకుతో.
అగ్నిలాంటిది అరుపు
ఎంత ఊదితే అంత మెరుపు.

# ప్రజ

పుర్రెలు వంచుకుని
అవకాశాలను మేసుకుంటూ పోయే
గొర్రెల మంద.
పండగ పండగకూ
గుండెల్ని జెండాల్లా ఎగరేసే
వెర్రిమేళం.
మైకుల్లోంచి వర్షించే వాగ్దానాల్తో
తడిసి మోపెడై జైకొట్టే
బిడత మూక.
ప్రభుత్వాలు మారినప్పుడల్లా
పాక ఇల్లవుతుందని ఆశించే
పిచ్చిమాలోకం.
జపమాల కనిపిస్తే చాలు
జాతకం మారుందని విశ్వసించే
జాలి గుండె.
పది చినుకులు పడితే చాలు
బతుకంతా పడ్డ ఆవిరిపాట్లను మరచే
మరుపు తెర.

"ఇదా ప్రజ ? ఇదా ప్రజ?"
వాగ్దానాల వర్షాజలాలు
పార్టీల కాల్వల్లోనే ప్రవహిస్తే
లేబిల్ మారిన ప్రభుత్వాలు
ఊబినే ఊతకొలనని ఊదరగొడితే
పక్కసున్న బలిసిన మేధ
పాక పీఠ నొక్కితే
వేళ్లమీది జపమాల
విషజ్వాలగా బుసకొడితే
గొర్రెలమంద కొమ్ములెక్కు పెడుతుంది.
వెర్రిమేళం విప్లవభేరి కొడుతుంది.
జాలి గుండె మంటయులా ప్రసరిస్తుంది.
మరుపుతెగ మెరుపుకత్తులు దూస్తుంది.
అప్పుడంటుంది లోకం
"అదీ ప్రజ అదీప్రజ."

# మత పతాక నీడలో

కత్తిపీట ఇచ్చింది
కుత్తుకలు తరగటానికి కాదు.
స్వాతంత్ర్యం వచ్చింది
సహోదరుల్ని నరకడానికి కాదు.
మత పతాక నీడలో
మారణవాణి పఠించే పీఠపతీ !
గ్రంథం మీద చెయ్యేసి చెప్పు
గద్దె ఒళ్లో దాచినవి
అక్షరాలా? ఆయుధాలా ?

ఎగిరిపో వెనక్కి వెనక్కి
స్వాతంత్ర్యోద్యమ సంగ్రామ గగనాల్ని
జ్ఞాపకాలతో పేల్చుకుంటూ.
"ఏమంది నీ మతం?
వందే మాతరం వందే మాతరం".
ఇప్పుడూ ఉంది ఆ తల్లే
కుడిచే రొమ్మును పొడిచే బిడ్డల
మూర్ఖత్వాన్ని మూల్గులతో పీల్చుకుంటూ

ఎప్పటికైనా తల్లి తల్లే.
ఇవాళ ముదివగ్గైనా
నీ కాల్పుల్లో కుమిలి కుమిలి మసిబొగ్గైనా.
పల్లవిస్తుంది తల్లిగుండె
ప్రతినిత్యం ఉషాద్యుతిలా
మతాతీత మానవతలా;
ఆ స్వరాన్నే సమన్వయ ప్రతిలో ఎగరేసుకుంటూ.

సి. నారాయణరెడ్డి

# చిగుళ్ల పండగ

పండగంటే వేరేమీ కాదు
ఉడికిపోతున్న ఒంటి మీద వానచినుకు.
చెమటతో చిర్రెక్కిపోతున్న ప్రాణికి
షవర్ బాత్.
రోజూ తిన్న అన్నమే
రోజాపువ్వుల్ని తొడుక్కొని వస్తుంది.
ఎప్పుడూ ఉన్న అనుభవమే
త్రీడీ చిత్రంలా నాడితలుపు తడుతుంది.
సగటు జీవికి పండగంటే
సంబరాల అంబరాల స్వారీ.
సాకు కావాలి కదా సరదాకి.
ప్రేమ విరిగితే
పగిలిన గుండెను అతికేది సారాతో.
ప్రేమ పెళ్లిగా మలుపు తిరిగితే
సంతోషాన్ని కొలిచేది సారాతో.
సగటు జీవులు అదోరకం సంతృప్తమతులు.
ఏటి పొడుగునా పండగలు తొడుక్కొందే
ఎటూ తోచదు పాపం.

చీకటిని పేల్చడానికి చిచ్చుబుడ్లపండగ.
చలిని కాల్చడానికి నెగళ్ల పండగ.
చివికిన ముఖాలను పలికించడానికి
చిగుళ్లపండగ.
వేసవిలో వెన్నెల చినుకు చిగురు.
వేదనలో వేడుక కబురు చిగురు.
వృక్షాలు చేసుకునే
అక్షరాభిషేకాలు చిగుళ్లు.
కుబుసంలా ఊడిన గతంలోంచి మెరిసే
కొత్త ఊహ చిగురు.
పగిలిన కాలం పెదవిమీద
ఉగాది ఓ చిగురు.

సి. నారాయణరెడ్డి

# నేను నేనుగా ఉంటానా?

ఒళ్లు బలిసిన ముదురెండను
ఒక్కొక్క వానచినుకు
ఉక్కు బాకులా పొడుస్తుంటే -
కళ్లు తిరిగిన అంధకారాన్ని
ఒక్కొక్క ఉదయకిరణం
వెయ్యికాళ్లతో తొక్కుతుంటే -
బుర్ర చెదిరిన అధికారాన్ని
ఒక్కొక్క ప్రతికావాక్కు
ఉప్పెన గొంతుతో ఊదేస్తుంటే -
నేను నేనుగా ఉంటానా ?
అరుస్తాను పసివాడిలా -
ఆనందాన్ని గర్జించే స్వరంతో.
నిలుస్తాను అసివాడిలా -
నిర్వీర్యతను నిర్జించే జవంతో.

# తెలుపెక్కని ఎలుకతోలు

కొళాయిల్లో నీళ్లు రాకున్నా
ఉపన్యాసాలు ఆగవు.
కరెంటు కాళ్లు తెగిపోయినా
వాగ్దానాలు కుంటవు.
పార్టీల మ్యానిఫెస్టోలు
గతుకు రోడ్ల మీద
గచ్చుతివాసీలపై నడుస్తాయి.
మైకుల గొంతు తెరలమీద
బొంకుపురాణాలూ తిట్లతిరనాళ్లూ
రీళ్లు రీళ్లుగా తిరుగుతాయి.
కిరాయి చప్పట్ల ప్రముక్తాయింపులతో
సభలు తబలాపై మోగుతాయి.
సందుల్లో మంచుబుడ్లతో
సంచుల్లో మామూళ్లతో
సముచిత సత్కారాలు జరుగుతాయి.
కులాల గర్భగుళ్లలో స్వార్థానికి
గుప్తాభిషేకాలు జరుగుతాయి.
ప్రజలకు ఒంటబట్టని రాజకీయాలు
పార్కుల్లో క్లబ్బుల్లో వాంతి చేసుకుంటాయి.

వీధి మలుపుల్లో కిళ్లీకొట్లముందు
వెర్రెక్కి గొంతులు చించేసుకుంటాయి.
రాజనీతి రంకుకాదనీ
ప్రజాస్వామ్యం ప్రహసనం కాదనీ
కొత్త విలువలు కుమ్ముకొచ్చేదాకా
ఈ వ్యవస్థ
తెలుపెక్కని ఎలుకతోలు.

# గది - వీధి

వీధికి వెర్రి
కిటికీ చువ్వల్ని పట్టుకుని
గదిలోకి దూరాలని.
గదికి పిచ్చి
కిటికీ చువ్వల్ని తెంచుకుని
వీధిలోకి దూకాలని.
సగటు బతుక్కి రెండు కళ్లు
గదీ వీధీ.
గదిలో ఉన్నంతవరకే కళ్లు.
దాటితే అవి కాళ్లు.
వీధిలో పడితే చాలు
ఆరుస్తాయి కాళ్లు
జన సముద్రాల్ని అంటించుకుని.
ఆలోచనల పురిటిల్లు గది
ఆచరణల రణస్థలి వీధి.

సి. నారాయణరెడ్డి

# ఎన్ని యుగాల ఎండుటాకలి

ఇసుకమూర్గే ఎడారి కంఠంలో
ఒంటెల అడుగులు తుంపర చినుకుల్లా.
ఎప్పుడు పడతాయో గిట్టల వడగళ్లు
ప్రతిరేణువు నిరీక్షణతపస్సులో.
ఎన్నియుగాల ఎండుటాకలి ఇది.
ఉక్కుకు తట్టుకోలేని దిక్కులు
ఒలిచేసుకుంటాయి తమపేర్లను.
శూన్యంలా పాకుతున్న నిశ్శబ్దంలో
మధ్య మధ్య దిక్కుతెలియని హోరు.
పొలాలతో జలాలతో మొహం మొత్తిన గాలి
మార్పుకోసం వస్తుంది మండుటెడారిలోకి.
కానేపట్లో ఆ గాలికి దప్పికేసి కళ్లుతిరిగి పడిపోతే
వేళ్లు చిలకరించి వీపు తడుతుంది
జాలి పితికే వెన్నెల.
ఎడారి ఓ వేయి పుటల వైరాగ్యశతకం.
ఎక్కడా రక్తి మొలవదు.
అప్పుడప్పుడు బట్టతల మీది జుట్టుపోచల్లా
ఖర్జూర వృక్షాలు ఆహ్వానిస్తుంటాయి
గజళ్లలాంటి గుత్తుల్ని ఆస్వాదించమని.

కొన్ని బతుకులు ఎడారి ప్రసవించిన కూనలు
ఎంత గీపెట్టినా పచ్చదనం పాలచుక్క దొరకదు.
ఇసుకను పిండుకుని గొంతు తడుపుకుంటూ
ఆశతో నిక్కిచూస్తుంటుంది ఎడారి
రేపటి చిగుళ్లచినుకు కోసం
ఆవిరిలోంచే ఆవిర్భవించే
ఊపిరి పిడికళ్ల కోసం.

# అతడు నడక మానేశాడు

గతకీర్తిని బొట్లుబొట్లుగా గతుక్కుంటూ
పడక పంజరంలో
ఒంటికి మూడంకె వేసుకుని
అతడు నడక మానేశాడు.
మొన్నటిదాకా నడిచేవాడు
మూపులో కాళ్లు మొలిపించుకుని.
అప్పుడు అతని నడక
తూర్పువీపు మీద చురక.
వెయ్యి చేతుల్తో ఆపులించే
తూర్పును ఆదిలించే అతడు
నడక మానేశాడు.
కాలు బెణికిందా కీలు విరిగిందా ?
నిక్షేపంగా ఉన్నాడు
సంతృప్తి రొంపిలో నిలువెల్లా కూరుకుని.
గతం — పాలిచ్చే పొదుగుకాదు
గంగడోలు.
మోగని చిల్లిడోలు.
వర్తమానం ప్రవాహం.
కాలనాళికలో చేసే సజీవప్రయోగం.

గతాన్ని కప్పుకున్న ఆ మృతమతి
గది దాటి రావడంలేదు.
ఏ పుట్టలో ఏ పాముందో ?
ఏ పెట్టెలో ఏ బాంబుందో ?
అడుగడుగునా మెలితిరిగిన భయాలు
అడుగుల్ని జడిపిస్తుంటే
అతడు నడకమానేశాడు.

సి. నారాయణరెడ్డి

# మౌనం అయిదు భాషల్లో

రాలిన పండుటాకుల మధ్య
మూలుగుతున్న పసిమి
చెట్టు గుండెలోకి చొరబడుతుంది.
చివరి మూలుగు
చిగురు భాష తొడుక్కుంటుంది.
చెట్టు ప్రసవిస్తుంది
పూలకళ్లనూ పళ్లగుండెలనూ.
గాలిపాడె మీదినుంచి
ఎండుటాకుల శవాలు
చేలలోకి దూకుతాయి.
చచ్చిన ఆకులు మురిగి మురిగి
పచ్చని మొక్కలకు ప్రాణం అరువిస్తాయి.
పంటను మేసి హరాయించుకున్న నోళ్లు
పడిపోతాయి నురగలు నురగలుగా.
మట్టిలోంచి లేస్తాయి ఆ నోళ్లు
మౌనాన్ని అయిదు భాషల్లో ఊదుతూ.

# నిద్రనుంచి జాగృతికి

కడుపునిండితే కవిత్వం రాదంటారు.
నిజమే – నిద్రొస్తుంది.
నిద్ర అంటుకున్న కంటిరెప్పల్లో
మగత పాతర వేస్తుంది మతిని.
నిద్రా రాక్షసనింద కాదిది.
మనిషికి నిద్ర అవసరం ఆహారంలాగా.
నిత్యం బొటనవేళ్ళపై నిలిచేదేశం నిద్రపోకూడదు.
దేశం నిద్రపోతే జాతికి సజీవసమాధి.
రెండు క్షణాలముక్క రెప్పల్లో మెరిసే నిద్ర
తదుపరి జాగృతికి టానిక్.
మామూలుగా దేశం నిద్రపోదు
మందుసోకిన విందులో తప్ప.
మన దేశానికి అందమైన బలహీనతలున్నాయి
మాతృస్తన్య పారంపర్యంగా.
సుజలాం సుఫలాం అని భక్తి స్తోత్రాలు
నిజం నిజం అంటూ నిప్పుల్లో దూకుతుంది.
ఎవడితో చెప్పుకునేది ఎగుడుదాపుల గతి
పైపునీళ్ల ఎండమావుల సంగతి.

కళ్లు కాసేపు విశ్రమిస్తే ఫరవాలేదు.
కాల్వలు నిద్రిస్తే
శ్రీశైలం తలపొలం దాటదు తెలుగుగంగ.
నిద్ర ఓ భయంకరమైన అంటువ్యాధి.
అది కళ్లకే కాదు ఫైళ్ళకూ సోకుతుంటుంది.
ఏడాది క్రితం వేసిన పునాదిరాయి
ఇంకా నిద్రపోతూవుంటుంది ధూళికంబళి కప్పుకుని.
నిర్వీర్యతకు నీరసావతారం నిద్ర
నిర్లిప్తతకు నిత్యాలంకారం నిద్ర.
మంచుతెరల మగతపొరల్ని తన్నుకుని
సంక్రాంతిసూర్యుడు శ్వాసలా ఉదయిస్తున్నప్పుడు
జారిపోతుంది నిద్ర బొట్లుబొట్లుగా
ఊరేగుతుంది జాగృతి జట్లుజట్లుగా.

# కవిత్వం వెలుగుతూవుంటుంది

ఏటా వచ్చే దీపావళిలా
కవిత్వం వెలుగుతూవుంటుంది
కటకటాల ప్రమిదల్లో.
వేసినశిక్ష రెండేళ్లదో
పన్నెండేళ్లదో ?
అయినా గడిపిన ఆ దశాబ్దిలో
అనుక్షణం సమస్యల అమావాస్యలే.
చిరకాల కారాగారజీవికి
ప్రతిరాత్రి ఒక తల్లిమూల్గు
ఒక ఇల్లాలి ఏడ్పు.
కవిత్వమూ అంతే –
అది మొలకగా వెలిగితే
పురుగుల చీకట్లు.
దీపస్తంభంలా ఎదిగితే
అసూయల కోరల కాట్లు.

సి. నారాయణరెడ్డి

# ఎంతరక్తం తైలమైతే

రూపాయలు నాటితే
దీపాలు మొలవవు.
అజ్ఞానం మొలుస్తుంది
అహంకారం మెరుస్తుంది.
వేళ్లతో సేద్యం చేస్తేనే
వేల దీపాల పంటలు.
ఒరిగిన పైరును కబళించే
వరద వెల్లువలా :
సీతాజ్యోతిని హరించే
పదితలల ప్రభంజనాలు.
కాలే ప్రతివత్తి ఒక క్రీస్తు;
ఒక మహాత్ముడు.
ఎంతరక్తం తైలమతే
ఆ జ్వలనం ఆ గమనం.
తల్లితీగ ప్రసవించిన పుష్పం
తైలదీపం.
ప్రసరించిన కాంతి పరిమళం
ప్రసవవేదనను మరిపిస్తుంది.

పాపల్లా ప్రతియేడూ
ప్రభవించే దీపాలు
ఆచారం ఒళ్లో నాటిన
అభ్యుదయ స్తూపాలు.

సి. నారాయణరెడ్డి

# మేలిముసుగులో సరస్వతి

ఇవాళ నా యింట్లో సరికొత్త దృశ్యం
మేలిముసుగులో సరస్వతి కూచున్నట్టు;
నమస్కరిస్తున్న ఆ శిరస్సుపై నేను
నా హృదయాన్ని అక్షింతలుగా చల్లుతున్నట్టు.
సరస్వతికి ఆశీస్సులా ?
ఔను – సరస్వతి చిరంజీవి.
అందుకే ఆశీస్సులు.
అనవసరస్తుతి చిరంజీవికి మృతి.
వేదంలో పలికిన సరస్వతి
వెర్రిబాగుల్ది.
కాకుంటే
పసివాళ్ల బోసిపలుకుల్లో
పల్లెటూళ్ల యాసచెణుకుల్లో
పకపక నవ్వుతుందా ?
వాగైనా వాక్కైనా
జలమైనా స్వరమైనా
అదృశ్యంగావున్నా ఆర్భాటంగావున్నా
ఆకృతికీ ఆశ్రుతికీ ప్రతీక సరస్వతి.

# కార్చిచ్చు

చేతులూ కాళ్లూ ఊరేగుతాయి
కుదుటపడుతాయి.
నోళ్లూ పిడికిళ్లూ అరుస్తాయి
విశ్రమిస్తాయి.
చిట్లిన తలలు చిందిన రక్తం
చిచ్చవుతుంది.
కలుషిత వ్యవస్థను కాల్చేసే
కార్చిచ్చవుతుంది.

సి. నారాయణరెడ్డి

# ఆగు ఒక్కక్షణం

ఆగు ఒక్కక్షణం –
చినుకు చెరువవుతుంది
చిగురు తరువవుతుంది
మనసు దున్నిన మాగాణిలో
కలుపు మొక్కలా మొలిచే
కలత కరువవుతుంది.

ఆగు ఒక్క క్షణం –
పుల్ల పువ్వవుతుంది
ముల్ల మువ్వవుతుంది
బతుకు దూకిన సెలయేటిలో
పక్కలన్ని అరిగిపోయిన
రాయి రవ్వవుతుంది.

# పాటా పక్షీ

ఎన్ని పక్షులు పాడుతున్నాయి
ఇంట్లో దూరిన ఆకాశంలో.
ఏవీ ఆ గూళ్లు ?
ఎక్కడివీ గుక్కతిప్పని నోళ్లు ?
మబ్బుల రొదల్ని కరిగించి
మాటలుగా మార్చుకున్నాయా ?
చిచ్చుపిడుగుల్ని మచ్చికచేసి
ఒళ్లో దాచుకుని
లల్లబీలు పాడుతున్నాయా ?
పాటకూ పక్షికీ
చూపుకూ అక్షికీ
ఉన్న సంబంధం
ఉదధికీ నదికీ తెలుసు
కాంక్షకూ కాలానికీ తెలుసు.

సి. నారాయణరెడ్డి

# అప్పుడప్పుడు జీవితం

అప్పుడప్పుడు జీవితం ఆవులిస్తుంటుంది
ఊరికే కాళ్ల కింద
పరుపులు మొలిచినప్పుడు.
అజీర్తి మెలికలు తిరుగుతుంది
అరగని కీర్తిలా
దిగంబరసత్యం డీకొన్నప్పుడు.
అఘాతాత్మ ఆనందిస్తుంటుంది
అర్ధరాత్రైనా
మనిషి నిద్రలో మేల్కొన్నప్పుడు.

# దేశానికి రెక్కలు

కాళ్ళకు సివరొచ్చింది
ఆరోసారి విశ్వం చుట్టూ
అదేపనిగా తిరుగుతుంటే.

కళ్ళకు పరుగొచ్చింది
చాలీచాలని కాలం
చతికిలబడి పోతుంటే.

మతి - పోతూ తిరిగొచ్చింది
గుప్పిళ్ళతో చల్లిన నక్షత్రాలు
ఎడారిలో మొక్కలవుతుంటే.

నేను - మళ్ళీ తలెత్తుకున్నాను
సందుల్లో ఉదయించిన శిశువులు
దేశానికి రెక్కలవుతుంటే.

సి. నారాయణరెడ్డి

# ఆకాశం సరదా

సరదా పుట్టింది ఆకాశానికి
మనిషి లాగే
తన ముఖం చూసుకోవాలని.
సింగారించుకుంది
పల్చబడ్డ మబ్బుల్ని
ముంగురుల్లా ఒత్తుకుంటూ.
నాలుగు పోచలు మిగిలిన నెత్తిని
నలభై సార్లు దువ్వుకునే మనిషి
చెడగొట్టినట్టున్నాడు
చిదంబరం కప్పుకున్న అంబరాన్ని.
కాకుంటే
ఆకాశానికి అద్దమెక్కడ ?
చేదబావిలో చెరువులో
అవులించే సముద్రం నురుగులో
అగుపించేది
ఆకాశం ముఖమే కదా !
అయినా సరదా పుట్టింది ఆకాశానికి
తన ముఖముద్రను మరింతగా
తరిచి తరిచి చూడాలని.

గుండెను చీల్చుకుని
కళ్లనిండా నింపుకుని చూసింది
తన ముఖం కనిపించింది
త్యాగధనుల రక్తం మడుగులో.

## డా॥ సి. నారాయణరెడ్డిగారి ప్రచురిత రచనలు

| | | |
|---|---|---|
| 1. | నవ్వని పువ్వు (గేయనాటికలు) | 1953 |
| 2. | జలపాతం (పద్యగేయ సంపుటి) | 1953 |
| 3. | విశ్వగీతి (దీర్ఘగీతం) | 1954 |
| 4. | అజంతా సుందరి (గేయనాటికలు) | 1954 |
| 5. | స్వప్నభంగం (గేయకావ్యం) | 1954 |
| 6. | నారాయణరెడ్డి గేయాలు (కవితాసంపుటి) | 1955 |
| 7. | నాగార్జునసాగరం (గేయకావ్యం) | 1955 |
| 8. | వెన్నెలవాడ (గేయనాటికలు) | 1956 |
| 9. | కర్పూరవసంతరాయలు (గేయకావ్యం) | 1957 |
| 10 | రామప్ప (రేడియో రూపకం) | 1959 |
| 11. | విశ్వనాథనాయుడు (గేయకావ్యం) | 1960 |
| 12. | దివ్వెలమువ్వలు (కవితాసంపుటి) | 1959 |
| 13. | సమదర్శనం (గేయసూక్తులు) | 1960 |
| 14. | ఋతుచక్రం (గేయకావ్యం) | 1964 |
| 15. | వ్యాసవాహిని (సాహిత్య వ్యాసాలు) | 1965 |
| 16. | అక్షరాల గవాక్షాలు (కవితా సంపుటి) | 1966 |
| 17. | జాతిరత్నం (గేయకావ్యం) | 1967 |

18. ఆధునికాంధ్ర కవిత్వము (పరిశోధన గ్రంథం) 1967
19. మధ్యతరగతి మందహాసం (వచన కవితా సంపుటి) 1968
20. గాంధీయం (గేయ సూక్తులు) 1969
21. మరోహరివిల్లు (కవితా సంపుటి) 1969
22. మంటలూ—మానవుడూ (వచన కవితా సంపుటి) 1970
23. ముఖాముఖి (వచన కవితా సంపుటి) 1971
24. మనిషి - చిలక (వచన కవితా సంపుటి) 1972
25. ఉదయం నా హృదయం (వచన కవితా సంపుటి) 1973
26. మందారమకరందాలు (వ్యాఖ్యానం) 1973
27. మార్పు నా తీర్పు (కవితా సంపుటి) 1974
28. తేజస్సు నా తపస్సు (కవితా సంపుటి) 1975
29. తరతరాల తెలుగు వెలుగు (నృత్యగేయ రూపకం) 1975
30. ఇంటిపేరు చైతన్యం (కవితా సంపుటి) 1976
31. పగలే వెన్నెల (సినీగీతాల సంకలనం) 1976
32. భూమిక (కావ్యం) 1977
33. మధనం (కావ్యం) 1978
34. నారాయణరెడ్డి నాటికలు 1978
35. ముత్యాలకోకిల (సరోజినీనాయుడు ఆంగ్లకవితలకు అనువాదం) 1979
36. మృత్యువునుంచి (సుదీర్ఘ కవిత : మరికొన్ని కవితలు) 1979
37. మా ఊరు మాట్లాడింది (వ్యాస సంపుటి) 1980
38. సోవియట్ రష్యాలో పదిరోజులు (యాత్రా చరిత్ర) 1980
39. విశ్వంభర (వచన కవితలో సమగ్ర కావ్యం) 1980
40. సమీక్షణం (వ్యాససంకలనం) 1981
41. అమరవీరుడు భగత్‌సింగ్ (బుర్రకథ) 1982
42. రెక్కలు (కవితా సంపుటి) 1982
43. నడక నాతల్లి (కవితా సంపుటి) 1983
44. కాలం అంచుమీద .... (కవితా సంపుటి) 1985